

# 16. ఫీల్ఖానా శంకర ప్రభువు (1855-1897)

ఖుతుబ్షాహీల కాలంలో గోలకొండ ఆంధ్రదేశానికి రాజధాని. అటు తరువాత ఆసఫ్‌జాహీల కాలంలో హైద్రాబాద్ రాజధాని. హైద్రాబాదు నగరానికి భాగ్యనగరం, భాగానగరం అనేవి మొదటి పేర్లు. హైద్రాబాదు నగరం నడిమినుండి పారేది మూసా నది. దాని మొదటిపేరు ముచికుందా నది. 20వ శతాబ్దం చివరిదాకా భాగ్యనగరమనీ హైదరాబాదనీ ముచికుంద అనీ మూసా అనీ రెండేసి పేర్లు వ్యవహారంలో ఉండేవి. మూసానదికి ఆవలివైపు పాతహైదరాబాదు, ఈవలివైపు కొత్త హైదరాబాదులని ప్రస్తుత వ్యవహారము. కొత్త హైదరాబాదులోనివే ఫీల్ఖానా, నాంపల్లి మొదలైన ప్రాంతాలు. ఫీల్ఖానా అంటే గజశాల. జనసంఖ్యపెరిగి గజశాల నరశాలగా మారిపోయింది. ఆ ఫీల్ఖానా కొందరికి ఇంటిపేరైనది. ఫీల్ఖానా ఇంటిపేరుగల శ్రీవత్స గోత్రీకులు నరసింహారావు, రామమ్మ అనే నియోగి దంపతుల సంతానం లక్ష్మణరావు గిరెమ్మ, రాధమ్మలు. ఆ దంపతులకు ఇంకా పురుషసంతానం కావలెననిపించి తీర్థాటనం చేసినారు. ఆయా దేవతలకు మ్రొక్కి నారు. చివరకు హుమ్నాబాదు మాణిక్యప్రభువులను (1817-1865) ఆశ్రయించినారు.

మాణిక్యప్రభువులు దత్తాంశసంభూతులని ప్రతీతి. బాల్యంనుండే ఆయన అనేక మహిమలు ప్రకటించిన మహానుభావుడు, కరుణామయుడు. నరసింహారావు రామమ్మ

దంపతుల భక్తికి మెచ్చి మాణిక్యప్రభువు తాము సేవించే భవానీ చంద్రమౌళీశ్వరుల పీఠానికి ఎదురుగా ఆ దంపతులను కూర్చుండ నాదేశించి ధ్యానించి రహస్యంగా వారితో "ఈశ్వరాజ్ఞానుసారం నా స్థూలశరీరం ఈనాటినుండి 27 దినాలకు విడుస్తాను. తరువాత మీకు పుడుతా"నని వరమూ తీర్థప్రసాదాలు ఇచ్చి పంపినాడు. తత్ఫలితంగా శా.శ. ౧౭౭౭ రాక్షసనామసంవత్సరం భాద్రపదబహుళ ౩౦ అమావాస్య గురువారం చిత్తానక్షత్రం మూడవపాదం రాత్రి ఒంటిగంటకు 11-10-1855, తెల్లవారితే శుక్రవారం ఒక మగబిడ్డ పుట్టినాడు. (ఇందులో ఏదో పొరపాటున్నట్లనిపిస్తున్నది. మాణిక్య ప్రభువులకాలం 1817-1865. మాణిక్య ప్రభువులు ఇరువదేడు దినాలకు తమ దేహం చాలించి రామమ్మ గర్భంలో ప్రవేశించి ఒక ఏడాదిలోగా పుట్టవలెనంటే అది క్రీ.శ. 1865 కావలెను కాని అంతకు పదేండ్లు ముందు 1855లో పుట్టటం కుదురదు.) పుట్టిన శిశువుకు వైభవంగా బారసాల చేసి శంకరరావని పేరుపెట్టినారు. అటు తరువాత నరసింహారావు రామమ్మ దంపతులకు మరొక కొడుకు రామరావు పుట్టినాడు. శంకర రావు శుక్లపక్షచంద్రునట్లు దినదినప్రవర్ధమానుడై సకల విద్యాప్రవీణుడైనాడు. శంకర రావు అన్న లక్ష్మణరావు అధ్యాత్మవిద్యాకోవిదుడై బ్రహ్మచారిగా నిలిచిపోయినాడు కాని శంకరరావు లక్ష్మీనరసమ్మను పెండ్లాడి కిషన్‌రావు అనే కొడుకును కన్నాడు. కొంతకాలం నిజాం ప్రభుత్వోద్యోగం చేసి సుఖశాంతులనుభవించినాడు. అన్నగారి సాంగత్యంలో అధ్యాత్మవిద్యను సాధిస్తూ ఉద్యోగం విడిచిపెట్టి వేదశాస్త్రపురాణ కాలక్షేపాలు చేస్తుండి నాడు. తండ్రిగారు చేసిన కరణీకం పెద్దవారిద్దరికీ పట్టనందున బేగంపేట కరణీకం రామరావు చేపట్టినాడు.

అన్నదమ్ములు తొలుత సిద్ధేశ్వర గురువులను ఆశ్రయించి పంచాక్షరీమంత్ర దీక్షితులై జపసిద్ధి పొందినారు. అటుతరువాత పూర్వజన్మపరిపాకం చేత ఆనాటి సుప్రసిద్ధ అచల గురువు భాగవతుల కృష్ణదేశికులను (1823-1876) ఆశ్రయించినారు. భాగవతుల కృష్ణదేశికులు నల్లగొండజిల్లా సుప్రసిద్ధ క్షేత్రం కొలనుపాకలో జన్మించినారు. కొంతకాలం తరువాత సమస్తవేదవేదాంగములను ఆపోశనం పట్టి వేదాంతవిచారము హరికథా గానములు చేస్తూ విరక్తులై హైద్రాబాదు నగరానికి వచ్చినారు. దినం ఐదిండ్లు భిక్షించి

ఏదో ఒక గుడిలో స్వయంపాకం చేసుకొని రాత్రులందు అక్కడే హరికథాగానం చేసి విశ్రమించేవారు. హైద్రాబాదు పెద్దమహరాజ్ గంజ్‌లో తండ్రి ఇంటనే ఉండే బాల వితంతువు తల్లావఝులజాలమాంబ ప్రార్థన మన్నించి భిక్షించితెచ్చిన బియ్యం ఆమెకిస్తూ వారింట భోజనం చేస్తూ జీవితం గడిపినారు. అచలవేదాంతంలో శివరామ దీక్షితుల తరువాత చెప్పుకోదగినవాడీ భాగవతుల కృష్ణప్రభువు. అచలవేదాంత ప్రతిష్ఠాపకులైన రామడుగు శివరామదీక్షితుల (1690-1791) ఒక శిష్యపరంపరలో ఈయన మూడవ వాడు. శివరామదీక్షితులశిష్యుడు కంబాలూరు అప్పమంత్రి ఆయనశిష్యుడు పరశురామ సీతారామయ్య, ఆయన శిష్యుడు కొలనుపాక భాగవతుల కృష్ణదేశికులు. కృష్ణదేశికుల రచనలు 1. అధ్యాత్మ తత్త్వకీర్తనలు 2. శక్తిద్వయ నిరాసక శుద్ధనిర్గుణతత్త్వ కందార్థ కందపద్యములు 3. జాలమాంబకు ఉపదేశించిన ద్వాదశ బోధనలు 4. భగవద్గీత - సారాంశజ్ఞానము 5. వేదాంత వార్తికము 6. హంస సంచార క్రమము - వివరము 7. శుద్ధనిర్గుణతత్త్వార్థ కందార్థముల రచన శా.శ. ౧౭౬౫ శుభకృత్ సంవత్సర మార్గశిర బహుళచవితి సోమవారం 4-12-1843 నాటికి పూర్తి ఐనట్లు గ్రంథస్థాధారమున్నది.

లక్ష్మణరావు, శంకరరావు సోదరులు భాగవతుల కృష్ణదేశికులను ఆశ్రయించి చతుర్విధశుశ్రూషలు చేసి ఆయన అనుగ్రహమునకు పాత్రులైనారు. భాగవతుల కృష్ణ దేశికులు హైద్రాబాదులో మొందుగా జాలమాంబకు అటుతరువాత ఫీల్ఖానా లక్ష్మణరావు శంకరరావు సోదరులకు మంగోలు వెంకట నర్సయ్యాచారికి శా.శ. ౧౭౯౮ ధాత సంవత్సర కార్తీక శుద్ధదశమి శుక్రవారం నాడు (27-10-1876) దీక్ష ఇచ్చి కృతార్థులను చేసినారు. అటుతరువాత ఇరువురన్నదమ్ములు అష్టాంగయోగములు సాంఖ్యతారక అమనస్కములు మంత్రజపసద్ధి పొందినారు. గుర్వనుగ్రహముతో శంకరరావు గురుత్వాధికారం కూడా పొంది అనేకప్రదేశాలు తిరిగి ఎన్నియో సత్కార్యాలు కృష్ణార్పణంగా చేసినారు. చాలా మందికి తత్త్వోపదేశంచేసి జన్మరాహిత్యం ప్రసాదించినారు. అన్నదమ్ములిరువురు లక్ష్మణ దేశిక ప్రభువులు, శంకరదేశిక ప్రభువుల పేరుతో ప్రసిద్ధులైనారు. శంకరప్రభువుల శిష్యపరంపర చాలా దొడ్డది. వారి శిష్యులు 1. మాధవరాజు వెంకటదాసు 2. హీరా మాన్‌సింగ్ 3. ముదిగొండ శంకరయ్య 4. మోటూరి అప్పలదాసు 5. గోగుల ఆగయ్య సాహు 6. కాగితాల రామబ్రహ్మం 7. అమర లింగయార్యులు 8. వరదా రామమూర్తి

9. గులాం మొయినుద్దీన్ (ఉత్తరాసిపల్లె సదానంద స్వామి) 10. రాజా కిషన్‌ప్రసాద్ (నైజాం ప్రధానమంత్రి) 11. మాదిరాజు సూర్యారావు 12. రాళ్ళబండి నరసింహశాస్త్రి 13. రాళ్ళబండి సీతారామయ్య 14. కృష్ణ మోహన పట్నాయక్ 15. మరుదూరి గోపాలాచార్యులు 16. పేర్ల కోదండరామయ్య ప్రభృతులు.

శంకరప్రభువులు శా.శ. ౧౮౧౪ నందననామసంవత్సరం మార్గశిరబహుళ నవమి సోమవారం 12-12-1892 ఒక బ్రహ్మసత్రం తలపెట్టి వైభవంగా నిర్వహించినారు. ముగింపునాడు తాము శా.శ. ౧౮౧౯ హేవలంబి సంవత్సరం శ్రావణ బహుళ నవమి శనివారం రోహిణి నక్షత్రం (21-8-1897) పగలు మూడుగంటలకు తమ స్థూలశరీరం విడుస్తామని ప్రకటించినారు. తమ శిష్యచూడామణి మాధవరాజు వెంకటదాసుకు గురుత్వాధికారము, గురుపాదుకలు ముద్రికాదిలాంఛనాలు ప్రసాదించినారు. ఒక సీసమాలికాపద్యం, ఫారసీ అక్షరాలముద్రిక, ఎఱ్ఱసిరాతో సంతకంచేసి ఇచ్చినారు. అన్నట్లే శంకరప్రభువులు ఐదేండ్ల తరువాత తమదేహం చాలించినారు. అప్పటికి వారి వయస్సు అధికమాసాలతో కూడా 43 సంవత్సరాల 23 దినాలు. ఈ విషయాలన్నీ మాధవరాజు వెంకటదాసు గురువుల ఎనిమిదవ సమారాధననాడు (1905) శిష్యు లందరికీ చెప్పినారు. ఇది శ్రావణ బహుళనవమినాడు జరిగి ఉండవలెను. కాని ప్రస్తుతం అచల శిష్యపరంపరల వారు శంకర ప్రభువుల ఆరాధనం భాద్రపద బహుళ అష్టమినాడు చేస్తున్నారు. (ఈ పొరపాటును వారు సవరించుకోవలెనని మనవి)

మాధవరాజు వెంకటదాసు శిష్యుల కోరికపై తమ గురువులు శంకర ప్రభువులు ప్రదర్శించిన మహిమలు చమత్కారములు తామువిన్నవి కన్నవి 12 సంఘటనలు వినిపించినాడు. అందులో కొన్ని 1. పార్థివ సంవత్సరం వైశాఖమాసంలో (1885 ఏప్రిల్, మే) ఉదయం 10 గంటలప్పుడు శంకరప్రభువులు సికింద్రాబాదునుండి తమ ఇంటికి నాంపల్లికి బయలుదేరినారు. వారివెంట రాళ్ళబండి నరసింహశాస్త్రి, పాటిబండ గురుమూర్తి, మాధవరాజు వెంకటదాసు మరికొందరు భక్తులు శిష్యులు ఉన్నారు. నాంపల్లి రైల్వేస్టేషన్ సమీపాన నల్లమందు గంజాయి కొట్టు యజమాని తన శిష్యుడు పసుల బాలయ్య ఇంటిముందు చేరగానే వారి ఎడమచేతిలోని దస్తీ (జేబు రుమాలు)

జారి క్రిందపడింది. శ్రీవారు వంగి దానిని తీసుకొని జేబులో పెట్టుకొని వీధిలోని మట్టి రెండు చేతులతో రెండు పిడికిళ్ళు ఎత్తి శ్రీకృష్ణ గురుమహరాజ్‌కు జై అంటూ తమవెంట ఉన్నవారిపై చల్లినారు. అది ఎఱ్ఱటిగులాల్ తెల్లటిబుక్కాగామారి పరిమళాలు వీధి అంతటా వ్యాపించినవి. శిష్యులుభక్తులు ప్రేక్షకులు ఆ అద్భుతంచూచి ఆశ్చర్యపడినారు.

2. శా.శ. ౧౮౧౦ సర్వధారిసంవత్సరం ఆషాడశుద్ధషష్ఠి (14-7-1888) శనివారం రాత్రి 8 గంటలప్పుడు శంకరప్రభువులు హుసేన్‌సాగరం చెరువుకట్టపైనుండి యాఖూత్‌పురం పోతుండగావారివెంట గౌఱ్ఱాజులక్ష్మీపతిరావు, వేదాంతం వెంకటప్పయ్య అవధాని, నల్గురు పోలీసు జవానులు, మాధవరాజు వెంకటదాసు, మరి కొందరు భక్తులు ఉండినారు. ఆ దారికి ఒక ప్రక్కనున్న తురక వేపచెట్టుకొమ్మను ప్రభువులు ఎడమచేత వంచికుడిచేత పిడికెడాకులు దూసి శ్రీకృష్ణగురుమహారాజుకు జై అని చల్లినారు. తురక వేపాకులు సంపెంగలు, చేమంతులు, పైడితంగేడు పూలైనవి. శిష్యులు భక్తులు వాటిని ఏరుకున్నారు.

3. శంకరప్రభువులు శా.శ. ౧౮౧౨ వికృతిసంవత్సరం కార్తీకబహుళనవమి శుక్రవారం 5-2-1890 నుండి ఒక వారంరోజులు సప్తాహం జరిపినారు. నాల్గవనాటి రాత్రి భోజనాలలోనేయితక్కువపడింది. నేయికోసంబస్తీలోనికిమనుష్యులను పంపించి నారు. 400 మంది బ్రాహ్మణ్యం భోజనానికి కూర్చున్నది. శంకరప్రభువులు 5 బిందెల నీళ్ళు ముచికుందానదినుండి తెప్పించి గురుపీఠం ముందు నిలిపి, తడి అంగవస్త్రం కప్పి, శ్రీకృష్ణదేశిక మనోరంజనభగవతీ జై అని తమ పంచపాత్రనుండి తీర్థం చల్లి సాష్టాంగపడి లేచి ఇకతీసుకపోయి అభిఘరించండి అన్నారు. 3 బిందెల పేరిననెయ్యి రెండు బిందెల కరిగిననెయ్యి సద్యోఘృతమట్లు దాచుకొని దాచుకొని వాచవులూర తిన్నారు. ఇంతలోబస్తీనుండి నేయి వస్తే ప్రభువులు ముచికుందనదిలో పోయండని ఆదేశించినారు.

4. ఒకనాడు శిష్యబృందం శంకరప్రభువులను పూజామందిరంలో కూర్చుండ బెట్టి షోడశోపచారపూజలు చేసినారు. పూజానంతరం ప్రభువులు భక్తులందరిని కాసేపు బయటికి నడవండని ఆదేశించి తలుపులు మూసినారు. పావుగంట తరువాత మరల

లోనికి రండన్నారు. భక్తులు శిష్యులు వచ్చిచూస్తే ప్రభువులు కనపడలేదు. అక్కడొక నాగుబాము పడగెత్తి బుసలు కొడుతున్నది. అందరు భయభ్రాంతులై బయటి కురికినారు. కొంత తడవైన తరువాత అందరు లోనికి రండని ప్రభువుల కంఠం వినిపించింది. అందరు తిరిగిపోయి చూస్తే ప్రభువులెప్పటివలె తమ ఆసనంపై ఉన్నారు. ఇంకొకచోట ప్రభువులు పులిరూపం ధరించటం తాము చూచినట్లు వరంగల్లులో కుచ్చలకంటి నరసింగరావు, యాముజాల వీరభద్రదీక్షితులు చెప్పినారు.

5. శంకర ప్రభువులవారిని ఒక గ్రామంవారు తీసుకపోయి పూజించి ఆరేయి మేళతాళాలతో పల్లకిపై ఊరేగించినారు. రెండు మూడు వీధులు తిరిగిన తరువాత శంకరప్రభువులా పల్లకిలోనే పడుకొని శాలువా కప్పుకున్నారు. గ్రామమంతా తిరిగి మధ్యరాత్రి పల్లకిని వారి బసచెంత నిలిపిచూస్తే పల్లకిలో కప్పుకున్నట్లు శాలువా ఉన్నదే కాని ప్రభువులదృశ్యమైనారు. అందరూ చింతామగ్నులైనారు. నాల్గుదినాల తరువాత పది పన్నెండు ఆమడల దూరం వేరొక నగరంనుండి జాబు వచ్చింది. అముకదినం నాడు రేయి ప్రభువులు తమ నగరానికి వచ్చినారని వారి పల్లకీ సేవ మూడుదినముల తరువాత జరుగనున్నది కావున అక్కడి భక్తులను రావలసిందని ఆ జాబు సారాంశం. ఈ గ్రామంలో ఊరేగిన రాత్రియే ప్రభువులు మరొక నగరంలో ప్రత్యక్షమైనారన్న మాట. ఇట్టిదే మరొక చోటినుండి జాబు వచ్చింది. మాధవరాజు వెంకటదాసుగారు చింతిరేలలో పోస్ట్‌మాస్టర్‌గా పనిచేస్తుండగా ఇట్టి మూడు జాబులు వచ్చినవి. రాయచూరు నుండి సీతారామరావు, మంతెననుండి గణపతి శాస్త్రి, మొలంగూరునుండి సర్వేశ్వర సోమయాజి, మన్మథ సం॥ 1895 వ్రాసిన జాబులివి.

6. ఒకనాడు పంచాక్షరి బసవలింగం అనే కంసాలి చిన్నవాడు ఆరేండ్లనుండి పార్శ్వపునొప్పితో బాధపడుతూ శంకరప్రభువులను ఆశ్రయించి తన బాధ తొలగించ వలసిందిగా ప్రార్థించినాడు. ప్రభువులు ముచికుందానది అవతలి గట్టున ఒక మూలిక ఉంది నాల్గుదినాల తరువాత రా తెచ్చిఇస్తాను అన్నారు. నాల్గవనాడు చంద్రగ్రహణ స్నానానికి 20మంది బ్రాహ్మణులు, నల్గురు కోమట్లు, ముగ్గురు కంసలబత్తులు శంకర ప్రభువుల వెంట స్నానాహ్నికములు తీర్చుకోవటానికి ముచికుందకు పోయినారు.

పంచాక్షరి బసవలింగం కూడా వారివెంట ఉన్నాడు. శంకరప్రభువులు వారి అనుష్ఠానం ముగించి తాము కూర్చుండే పులిచర్మాన్ని నిండుగా పారే ముచికుంద నీటిపై పరచి ఒడ్డున కూర్చుండి యోగధారణ చేసి శ్రీకృష్ణప్రభు మహారాజుకు జై అంటూ భూమికి గజం ఎత్తుపైకి లేచి పులితోలుపై కూర్చుండి సఱ్ఱున ఆవలిగట్టుకు పోయి ఒక వనమూలిక పట్టుకవచ్చి బసవలింగానికిచ్చినారు. దీని వేరు గంధంతీసి కన్నుల్లో పెట్టుకొని 3 తులాల తాటిబెల్లం, ఆవుపాలు అనుపానంగా పుచ్చుకో అన్నారు. ప్రభువుల బట్టలకు తడిలేదు. పులితోలు అడుగుభాగం మాత్రం తడిసింది. ఆరోగ్యవంతుడైన బసవలింగం ఈ వృత్తాంతం మాధవరాజు వెంకటదాసుకు వినిపించినాడు.

శంకరప్రభువులు ప్రదర్శించిన ఇట్టి అద్భుతాలు ఈ గ్రంథంలో 12 ఉన్నవి. ఈ మహిమలన్నీ శ్రీవారు తమ ఉపాస్యదైవతం చేత చేయిస్తూ తాము మాత్రం ద్వాదశాక్షరీమంత్రార్థ స్వరూపులై ఉండేవారని మాధవరాజు వెంకటదాసుగారి ఉవాచ. రామకృష్ణాద్యవతారాల వలె తమ గురువులు కూడ అనేకమహిమలు ప్రదర్శించినారని వారి జీవితచరిత్రను భక్తులు చదివి పరమపదం పొందవచ్చుననే ఉద్దేశంతో వచన గ్రంథంగా కూర్చినామనీ అన్నారు. ఇంకా భాగవతుల కృష్ణప్రభువుల రచన శుద్ధనిర్గుణ తత్త్వ కందార్థములు, శంకరప్రభువులు రచించిన భక్తజనముక్తావళి నిజగురుస్తవం అనే రెండు గ్రంథాలు సుజ్ఞానదీపమనే గురుగీతల గ్రంథం 1886,1892,1894 సం॥ అచ్చు వేయించినామన్నారు. 1904వ సం॥ జ్ఞానామృతం, భక్తానందసాగరం ప్రకటించి నామని చెప్పినారు. గురువునందు, గురువు తెల్పిన మంత్రమందు, ఆ మంత్రార్థమందు, మంత్రాధిదేవతయందు దైవస్వరూపాలను తెలిపే గ్రంథాలయందు బుద్ధులు నిల్పి దినాలు వెళ్ళబుచ్చటమే తమకు తమశిష్యులకు పరమార్థమన్నారు. ఇది చంద్రశేఖర స్తవరాజమనే యోగశాస్త్రానికి అనుబంధంగా ప్రకటితమైన 26 పుటల గ్రంథం. ఈ గ్రంథం ముఖపత్రం ఈ విధంగా ఉంది.

శ్రీమత్ ఫీల్ఖానా శంకరదేశిక ప్రభుప్రియ శిష్యాగ్రేసరుండును శ్రీమద్భవానీ చంద్రమౌళీశ్వరవరప్రసాదలబ్ధకవితావిలాసపరిపూర్ణుండును అచలగురుండును బ్రహ్మశ్రీ మాధవరాజు వేంకటేశ్వరదాస ప్రణీతంబైన శ్రీ చంద్రశేఖర స్తవరాజమను

యోగశాస్త్రము. ఈ గ్రంథము తద్దేశికానుగ్రహపాత్రులగు పీసపాటి లక్ష్మీకాంతరావు గారును, ఈ-కోటయ్యగారును, కోటంరాజు కామేశ్వరదాసు గారును, దొడ్డా నరసింహ దాసుగారును, యేపూరి పెదకుటుంబయ్యగారును, ఈ నామంబులు గల నిజభక్తుల ద్రవ్యసహాయముచే చన్నపట్టణము బరూరు త్యాగరాయశాస్త్రులవారి గీర్వాణభాషా రత్నాకరముద్రాక్షరశాలయందు ముద్రింపించి ప్రకటింపబడియె. ౧౯౦౫ సం.

శంకరప్రభువుల అగ్రజులైన లక్ష్మణప్రభువులు మొదటిసారి శివరామదీక్షితుల అచలగురుమందిరం అటు తరువాత తమ గురువులైన భాగవతుల శ్రీకృష్ణదేశిక ప్రభువుల సమాధి ఏర్పాటు చేసినారు. లక్ష్మణ ప్రభువులు తమ **68**వయేట **1-2-1913** నాడు విదేహకైవల్యం పొందినారు. తమకంటె ముందే పోయిన తమ్ముడు శంకర ప్రభువుల సమాధి కూడా బేగంపేటలోనే నిలిపినారు. బేగంపేట విమానాశ్రయంగా మారినప్పుడు ఈ సమాధులన్నీ నేలమట్టమైనవి.

"మూసానదీ ఈసానదీ ఇస్ నదీసే బడా నహీ

బడే బడే అవతారోంకో భీ ఇస్ నదీకా ఖబర్ నహీ" - (భాగవతుల కృష్ణప్రభువు) మూసానదీ (ఇడానాడి) ఈసానదీ (పింగళానాడీ) ఇస్ నదీసే (సుషుమ్నానాడికంటే) బడా నహీ (పెద్దవికావు). బడే బడే అవతారోంకోభీ (గొప్ప గొప్పవారికి కూడా) ఇస్ నదీకా (ఈ సుషుమ్నానాడియొక్క) ఖబర్ నహీ (గుర్తు తెలియదు) మూసానది రాకమచెర్ల వద్దనుండి వస్తుంది. అక్కడ ముచికుందుని పాదాలున్నవి. రాకమచెర్ల వెంకటదాసు ప్రసిద్ధ వాగ్గేయకారుడు. ఈసానది శంకరపల్లికి పైనుండి వస్తుంది. ఈ రెండు నదులు హైదరాబాదు సికింద్రాబాదు జనానికి సుపరిచితములు.

**ఆధారం :**

1. పైన పేర్కొన్న గ్రంథం జిరాక్స్ కాపీ - శ్రీసత్యసాయి భక్తులు, తాళ్ళూరువాసి కొప్పరపు బాలమనోహరరావుగారు పంపినారు. బాలమనోహరరావుగారు మాధవరాజు వెంకటదాసుగారి దౌహిత్రులు, బహుగ్రంథకర్తలు, కొప్పరపు గోపాలకృష్ణమూర్తిగారి కుమారులు.
2. సీతాఫల్‌మండి ఫీల్ఖానా లక్ష్మణదేశికప్రభువు అచలమందిరం అధ్యక్షులు, సమష్టి బోధానంద ఉప్పలంచి కృష్ణమూర్తిగారందించిన సమాచారం.